# దాసు సుదర్శిని

సంగీతం

**శ్రీ ములగలేటి గోపాలకృష్ణ**

సేకరణ - సంపాదకత్వం

**కుమారి సి.హెచ్.సీత**

దాస సుదర్శిని

సి.హెచ్. సీత

కవరు పేజీ:

శ్రీమతి రంగ విజయ

ప్రథమ ముద్రణ

జనవరి, 2002

ప్రతులు: 1000

ప్రచురణకర్తలు :

శ్రీ పరిమళ సాంస్కృతిక సంస్థ భజన మండలి

అశోక్ నగర్, హైదరాబాద్ (ఆం.ప్ర.)

తిరుమల తిరుపతి దేవస్థానం వారి

ఆర్థిక సహాయ విధానం క్రింద ఒసగిన విరాళం

ఈ గ్రంథ ముద్రణకు తోడ్పడినది

మూల్యము : [illegible]

ముద్రణ:

డెల్టా గ్రాఫిక్స్

గాంధీ నగర్, హైదరాబాదు

ఫోన్:7623617

ప్రతులకు:

శ్రీ పరిమళ సాంస్కృతిక సంస్థ భజన మండలి,

1-10-223, అశోక్ నగర్,

హైదరాబాద్, 500 020

ఫోన్: 711105

# తొలిపలుకు

దాస సుదర్శినికి తొలిపలుకు వ్రాయడం సంస్థ అధ్యక్షురాలిగా నాభాగ్యం, అదృష్టంగా భావిస్తున్నాను. కుమారి సి. హెచ్.సీతగారు చాలా శ్రమపడి దీనిని భక్తజనావళికి అందించడం నిజంగా భక్తులకు వరం. ఆమె జీవన సాఫాల్యం.

కర్ణాటక హరిదాసుల సంక్షిప్త జీవిత చరిత్రలు ఇందులో పొందుపరచడంతో హరిదాసుల కీర్తనామృతధారల పుట్టుక అవగతం కావడానికి దోహదం చేస్తుంది. శ్రీ ములగలేటి గోపాలకృష్ణగారి సంగీత సారథ్యంలో మా భజనమండలి ఇందులో పొందుపర్చిన కీర్తనలన్నియు, అనేక ప్రదేశములలో దేవాలయములయందు, మఠములయందు గానముచేసి కీర్తినార్జించుకున్నది. భక్తి సంగీత ప్రచారమే ముఖ్యోద్దేశముగా గల ఈ కృషినేటి ఆధునిక యాంత్రిక జీవనంలో మానవునికి ఆనందాన్ని సుఖాన్ని ఇవ్వగలదు. గురుస్వామి జగన్నాధ దాసాచార్యులు చెప్పినట్లు ఎవరు ఏ గొంతుతో, ఏవిధంగా భగవన్నామ కీర్తనచేసినను అవి అన్నియు ఆ పరమాత్మ మహా సముద్రంలో కలిసేవి కనుక, ఆ ప్రయత్నం చేసినవారి జన్మ చరితార్ధకంకాక మరేమి కాగలదు.

"ఎవరి హృదయమందు ఎంత భక్తి కలదో ఎవరికెఱుక
దీని శక్తి అంతుపట్టగ నెరుగ సామర్ధ్యమెవరికికలుగు
భక్తిపాశములు అలవైకుంఠపురములోని నారాయణుని
పట్టి భక్తునిముంగిట కీడ్చుకొనియున్న
మహావృక్షమునైన పెకలించుకొని వచ్చు మహా జల ప్రవాహమువోలె."

**శ్రీమతి చాగంటి సీతాలక్ష్మి**

**Kotra Mallikarjuna Sharma**
'KAUSIKASA' M.A., LLB., I.B.P.S.
**Deputy Director**
All India Radio, Hyderabad-4.
©: 232076 Ext.: 239

**Residence:**
65/C, Sanjeeva Reddy Nagar,
"C" Type Colony, Hyderabad - 38 (A.P.)

Station : Hyderabad
Date : 14-6-1999

సంగీత సాహిత్యాలు సరస్వతీమ తల్లి మానవాళికి ప్రసాదించే అమూల్యవరాలు. సాహిత్యం మానసికోద్యానవనము వికసించడానికి ఉపకరించితే – సంగీతం మానసికోల్లాసాన్ని వలసినంతగా ప్రసాదిస్తుంది.

అనాది కాలం నుండి ఉత్తర భారత సంగీతం రాజులను రాజాస్థానాలను ఆశ్రయించి విరాజిల్లితే – దక్షిణాది సంగీతం భక్తి భావప్రచోదితమై – మానవాళికి ఆనందంతో పాటు మోక్షానికి కూడా హేతువైంది. అందువల్లనే సంగీత బ్రహ్మ త్యాగరాజస్వామి – ముద్దుస్వామి దీక్షితులు శ్యామశాస్త్రి లాంటి సంగీత మూర్తి త్రయం కేవలం దాక్షిణాత్యులకే కాక యావత్ప్రపంచానికి సంగీత రసధునులనందించడమే కాక భక్త జనావళికందరికి – ముక్తి మార్గసోపానాలను దర్శింపజేసి వారు ముముక్షువులు కావడానికి దోహదం చేశారు. ఉత్తర భారత దేశంలో మీరాబాయి, కబీర్ దాసు, తులసీదాసు మొదలైన వారు భక్తి తత్పరతతో భగవద్గానం గావించారు.

అలాంటి కోవకు చెందినదే, మరో భక్తి భావ చోదకమైనది, కర్ణాటక రాష్ట్రానికి చెందినది, దాసాహిత్యం. దాస సాహిత్య రంగంలో మణిపూసలన దగినవారు పురందరదాసు, కనకదాసు, – పదిహేడు – పెద్దెనిమిది శతాబ్దలకు చెందిన విజయదాసు – గోపాలదాసు, మోహనదాసు – ప్రసన్న వెంకట దాసు – జగన్నాథదాసు లాంటి మహా మహులు.

ఈ కర్ణాటక హరిదాసులు – సకల భోగాలను త్యజించి – దాసవేషంబూని – తంబూర, చిరుతలను ధరించి – తమ సంగీత, సాహిత్యాల ద్వారా ధర్మ ప్రచారాన్ని గావించి – ఆనాటి ప్రజాకోటిని ఋజుమార్గ వర్తనులను గావించి, వారిలో అవసరమగు చైతన్యాన్ని, సామాజిక స్పృహను కల్గింపజేశారు. ఈ మహనీయులు ఆంధ్రదేశపు అంచులను గూడ స్పృశించి – తిరుమలేశుని వరకు వచ్చి, స్వామి వారిని మనసారా కీర్తించి తరించారు. వీరిలో కొందరు తెలుగు వారు కూడా.

ఇలాంటి పుణ్య పురుషుల కీర్తనలకు ఆధునిక బాణీలను సమకూర్చి, తమ శిష్యులతో సహా తిరుపతి పండరీపురం, కౌతాళం, ఉడిపి, పలిమారు, మొదలగు పుణ్యక్షేత్రాలలో దాస సాహిత్యాన్ని గానం చేయించి వారిలో దాస సాహిత్యాపు భక్తితోయాలను ప్రవహింపజేసిన సంగీత దర్శకులు శ్రీ ములగలేటి గోపాలకృష్ణ గారు నిజంగా ధన్యులు. వీరికి అన్ని విధాలా బాసటగా నిల్చ – వీరిచేత దాస సాహిత్య ప్రచారానికి తమ వంతు చేయూతనందించి సహకరించిన శ్రీ పరిమళ సాంస్కృతిక సంస్థ సభ్యులు – విశేషించి శ్రీ జె.వి. అప్పారావు గారు, వసుంధరా దేవి దంపతులు, లలిత గారు, నిర్మల గారు ప్రభృతులు నిజంగా శ్లాఘనీయులు.

ఎంతో శ్రమ కోర్చి, దాససాహిత్య స్రష్టల జీవిత విశేషాలను సేకరించి – శ్రీ గోపాల కృష్ణ గారి వివిధ సంగీత కృతులను రాగాల వారిగా – తాళాల వారిగా ఏర్చి కూర్చి, అనేక విశేషాలతో ఈ ముచ్చటైన గ్రంధ రాజాన్ని తెలుగు పాఠకలోకానికి అందించడానికి కుమారి సి.హెచ్. సీత గారు చేసిన కృషి శతధా, బహుధా ప్రశంసనీయం. "దాస సుదర్శిని" అనే పేరుతో మన ముందుకు వస్తూన్న ఈ భక్తి భావ, సంగీత సాహిత్య సమ్మిశ్రిత గ్రంథరాజం అజుని రాణి గళ సీమనలంకరించిన మరో మణిహారం.

ఇది సంగీత సాహిత్య ప్రియులకు ఉపకరించే మరో కరదీపిక.

ఇట్లు

బుధజన విధేయుడు

**కొట్ర మల్లిఖార్జున శర్మ**

# నా మాట

ఓంకారం ప్రణవస్వరూపం, నాదం దాన్నుంచి ఆవిర్భవించింది. అందుచే నాదమే ఆ పరబ్రహ్మస్వరూపం. ఆ పరబ్రహ్మస్వరూపుడైన శ్రీనివాసుని శ్రీ చరణాలకు శిరసాభివందనములు.

నాదోపాసకులు బ్రహ్మజ్ఞాన స్వరూపులు. అట్టి ఆత్మజ్ఞాన సంపూర్ణులు సారస్వత మూర్తులు, సంగీతశాస్త్ర కోవిదులైన దాసవరేణ్యులకు రాగరంజి తాంజులులు.

పాదమహిమో పెద్దల ఆశీర్వాదబలమో సుస్వరపునాదఫలమో అన్నట్లుగా ఆ కోనేటిరాయుని కరుణాకటాక్షం వల్ల దాసకీర్తనలను సాధనేచేసే సదవకాశం కల్పించిన మా గురువుగారైన శ్రీ ములగలేటి గోపాలకృష్ణగారికి భక్తితో ప్రణామాలర్పిస్తున్నాను. తాను నిరంతర కృషి చేస్తూ శిష్యులచేత సాధన చేయిస్తున్న మా గురువుగారికి "పరిమళ" శిష్యులం ఎంతగానో ఋణపడి వుంటాము.

లలిత సంగీతంతోపాటు దాసకీర్తనలను కూడ అభ్యసించడానికి తగిన సదవకాశం కల్పించి ప్రోత్సహిస్తున్న శ్రీ పరిమళ సాంస్కృతిక సంస్థ. అశోక్‌నగర్, హైదరాబాద్ (ఆంధ్రప్రదేశ్), వైస్ ఛైర్మన్ శ్రీ జె.వి. అప్పారావు గారికి, ప్రెసిడెంటు శ్రీమతి చాగంటి సీతాలక్ష్మి గారికి మరియు ఇతర కార్యవర్గ సభ్యులైన శ్రీమతి జె. వసుంధరాదేవి గారికి, శ్రీమతి లలితారావు గారికి, శ్రీమతి నిర్మలారావుగారికి, శ్రీమతి డి. లీలగారికి, మరియు శ్రీ సూర్యచంద్రరావు గారికి హృదయ పూర్వక అభివందనములు.

దాస కీర్తనల సేకరణలోను, కూర్పులోను, తగిన సలహాలనిచ్చి సహృదయంతో సహాయ సహకారాల నందించిన శ్రీ కె. గోపినాధరావు గారికి కృతజ్ఞతాభివందనములు.

నా ఈ ప్రయత్నానికి ప్రేరణ, స్ఫూర్తినిచ్చి ప్రోత్సహించిన శ్రీమతి యమ్. రాధాకృష్ణమ్మగారికి, శ్రీ జె.వి. అప్పారావు గారికి, శ్రీమతి జె. వసుంధరాదేవి గారికి మనఃపూర్వక నమస్సులు.

కోరినదే తడవుగా ప్రోత్సహించి ఆదినుంచి తుదివరకు ఇతోధిక కృషిచేసి ఈ సేకరణకు ఒక రూపురేఖనిచ్చి కూర్పులోను, వర్గీకరణలోను తగిన సలహాలనిచ్చిన మా గురువుగారైన శ్రీ ములగలేటి గోపాలకృష్ణగారికి వినయ పూర్వక వందనములు.

దాస పంచక తేజోముఖ వర్చస్సులను ముచ్చటగా మూర్తీభవింప జేసిన శ్రీమతి రంగవిజయగారి కడు శ్లాఘనీయమైన కళానైపుణ్యానికి కైగవ దోయిలించి నమస్కరిస్తున్నాను.

మనకున్న దాససాహిత్య సౌరభాన్ని సంగీతనిధిని భక్తిరసాన్ని ఒక చిన్న పుస్తకములో అందించాలనే ఉద్దేశ్యంతో కృషి చేసిన ఫలితమిది. నాకు తెలిసినది కొంత, తెలుసుకోవాల్సింది కొండంతగా ఉన్నప్పటికి పరిమితమైన జ్ఞానంతో ఈ ప్రయత్నం చేశాను. కన్నడ భాషా పరిచయం లేనందువల్ల ఏవైనా లోపాలుంటే అది కేవలం అశక్తతగా భావించి సహృదయంతో స్వీకరించ ప్రార్ధన.

ఈ పుస్తకం 3 ఖండికలుగా రూపొందించడం జరిగింది. ప్రధమఖండికలో దాస సాహిత్యపుట్టుక, పరిణామం, చారిత్రక ప్రాధాన్యత గురించి వివరించడమైనది. రెండవ ఖండికలో ఒక్కొక్క దాసులవారిని స్తుతిస్తూ శ్లోకం వారి జీవితచరిత్ర మరియు ఆ దాసులవారి రచనలను సేకరించి పొందుపరచడమైనది. అనుబంధంలో తృతీయ ఖండిక సాధారణ అకారాది పట్టిక, శ్లోకాల అకారాది పట్టిక, రచయితల సూచిక, రాగసూచిక, ఉపయుక్త గ్రంధసూచిక, మరియు దాసులవారి జీవిత విశేషాలను సూచించే పట్టిక ఇవ్వడం జరిగింది. దాస సాహిత్య ప్రియులకు ముఖ్యంగా కన్నడభాషా పరిచయంలేని తెలుగువారు కన్నడకస్తూరి కమనీయ సౌరభాలను ఆఘ్రాణిస్తే నా ఈ ప్రయత్నం సఫలీకృతమైనట్లే!

**సి.హెచ్. సీత**

# కృతజ్ఞతలు

నా కోరికను మన్నించి ఎంతో ఓర్పుతో అభిమానంతో ఈ "దాస సుదర్శిని" ని ముద్రించడంలో విలువైన సలహాలను విశేషమైన సూచనలను ఇచ్చి కన్నడ భాషతో గాని సాహిత్యంతోగాని ఇంచుకైనా పరిచయంలేని నా ఈ చిరు ప్రయత్నాన్ని ఎంతో ఆత్మీయంగా సహృదయంతో ప్రోత్సాహపరచిన శ్రీ K. Appannacharya, Special Officer, దాస సాహిత్య ప్రాజెక్టు, తిరుమల తిరుపతి దేవస్థానము గారికి నా వినమ్ర ప్రణామములు.

నా ఈ ప్రయత్నాన్ని వెనలుబాటు కల్పించి ప్రోత్సాహపరిచిన శ్రీ P.V.R.K. Prasad I.A.S., డైరెక్టర్ జనరల్, డా॥ మర్రి చెన్నారెడ్డి మానవ వనరుల అభివృద్ధి సంస్థ, హైదరాబాద్ గారికి మరియు శ్రీ.కె. వెంకటేశ్వర్లు గారికి కృతజ్ఞతాభివందనములు.

నా పరిశోధనా సృష్టికి వెలలేని ఆశీస్సులు, విలువైన సూచనలు ఇచ్చిన మా గురువుగారు శ్రీ ములగలేటి గోపాలకృష్ణ గారికి శిరసాభివందనములు.

తమ పనులలో తలమునుకలుగావున్నప్పటికీ కోరిన వెంటనే తగు సమయాన్ని కేటాయించి అచ్చుపడిన తొలి ప్రతులలోని అక్షరదోషాల్ని సరిదిద్ది సవరించిన స్నేహశీలి శ్రీ.కె. గోపీనాధ రావు గారికి కృతజ్ఞతాశతములు.

ముద్రణార్థం ఆర్థిక సహాయం అందించిప్రోత్సహించిన తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వాహక మండలికి హార్దిక కృతజ్ఞాతాభివందనములు.

స్నేహాన్ని పురస్కరించుకొని ఆత్మీయతతో తగు సలహాలు, సూచనలను ఇచ్చిన మిత్రులు యువకవి, రచయిత శ్రీ.కె. రామచంద్రమూర్తిగారికి కృతజ్ఞతలు.

నా ఈ గ్రంథ పరిశోధనాదశలో విషయసేకరణ నిమిత్తమై ఆర్థిక సహాయం అందించిన శ్రీ శ్యామ్ (సంతోష్ బుక్ ఎంటర్ ప్రైజెస్) గారికి, శ్రీ వాసు (శ్రీనివాసా ఆర్ట్ ప్రింటర్స్) గారికి, శ్రీమతి లీలగారికి, రామాయమ్మ గారికి మరియు శ్రీ V. రాఘవేంద్రరావు గారికి నా వినయ పూర్వక కృతజ్ఞతలు.

చక్కని ముఖచిత్ర పరికల్పన చేసి తమ భక్తిని ఆవిష్కరించిన శ్రీమతి రంగవిజయ గారికి నేనెంతో ఋణపడివున్నాను. అతి స్వల్ప వ్యవధిలో ముచ్చటగా ముద్రించి ఇచ్చిన డెల్టా గ్రాఫిక్స్ వారికి కృతజ్ఞతలు.

పంచముఖి ప్రాంగణంలో నెలకొనియున్న శ్రీ పరిమళా సాంస్కృతిక భజన మండలి వారి ప్రోత్సాహం నా ఉత్సాహానికి మూలకందమై ఈ గ్రంథరచనకు ఉద్యుక్తురాల్ని గావించిందనటం అతిశయోక్తి కాదు. అటువంటి ఆ మహామహులకు మన పూర్వక కృతజ్ఞతలు. ఇంకా ఈనా ప్రయత్నం సఫలీకృతం కావడానికి సహాయపడిన మహానుభావు లందరికీ పేరు పేరునా కృతజ్ఞతాభివందనములు

సీత

# విషయ సూచిక

## రచన : శ్రీమతి పాలపర్తి అన్నపూర్ణ

పల్లవి : పరమపుణ్యధామము భరతజనని పావనము
దేవఋషుల చరితము వేదసార శోభితము ॥ప॥

చరణం (1) : ఆచార్యులు హరిదాసులు వాగ్గేయకారులై
ధర్మపధము నడిపించిరి నిష్టాగరిష్టులై
సర్వవేదసారమును సర్వమూల గ్రంధముగా
మధువులొలుక రచయించిరి శ్రీమధ్వాచార్యులు
వ్యాససాహిత్యమై భాసిల్లె నీ ధరణి
సర్వజనామోదముగా దాససాహిత్యముగా
నరహరి తీర్థులు శ్రీపాదరాజులు
విరచించిరి దానిని ముక్తి పధము చూపగా

చరణం (2) : సంగీత సాహిత్య ధర్మముల మర్మములను
త్రివేణి సంగమముగ లక్షలాది కీర్తనలను
వ్రాసి తరియించిరి శ్రీ పురందరదాసులు
కనకదాసులు విజయదాసులు ఎందరెందరో
మధ్వాచార్యుని వారసులై ధర్మమునే బోధించిరి
హరి మహిమలనే గ్రోలిరి శ్రీ గోపాల దాసులు
దైవభక్తి త్యాగనిరతికి వారికెవరులేరు సాటి॥

దాసవర్యరిగొందిపె దాసవర్యరిగెరిగి
జన్మాంతరద దోషవ పరిహరిసి కొంబె

# దాససాహిత్యం, పుట్టుక, పరిణామం, చారిత్రక ప్రాధాన్యత

వేదాలలో ఉపనిషత్తులలో పురాణాలలో పొందుపరచబడిన ఆధ్యాత్మిక ధర్మసూక్ష్మాలను సామాన్యుల అవగాహన కోసం ప్రభవించిన సాహిత్యమే కర్ణాటక హరిదాస సాహిత్యం. కృతయుగమున తపస్సు వలనను, త్రేతాయుగమున యజ్ఞయాగాదుల వలనను ద్వాపరయుగమున దాన ధర్మముల వలనను, కలియుగమున కేవలం భగవన్నామ సంకీర్తనతోనే జన్మ తరింపగలదన్న పెద్దలమాట తథ్యము. భారతదేశ సంగీత సాహిత్య చరిత్రలో 14,15,16 శతాబ్దములలో ఎందరో వాగ్గేయకారులు అవతరించిరి.

క్రీ.శ. 15వ శతాబ్దం ప్రారంభంలో కన్నడ సాహిత్య చరిత్రలో కమనీయ యుగం ప్రారంభమైంది. కర్ణాటకలో విష్ణుభక్తి ప్రతిపాదకాలైన రచనలకు ఈ యుగం ప్రోత్సాహమిచ్చింది. ఈ యుగంలోనే హరిదాస సాహిత్యం ప్రాదుర్భవించి వికసించింది. క్రీ.శ. 16వ శతాబ్దంలో శ్రీకృష్ణదేవరాయలు సాహిత్యానికి గొప్ప ప్రాధాన్యత నిచ్చారు. కన్నడసాహిత్యం సంగీతంతో కలిసి కీర్తనల రూపమున అమృత ప్రవాహంలా సాగినది. భగవద్భక్తితో ప్రేరితులైన హరిదాసులు జనసామాన్యంలో భక్తిబీజములను నాటిరి. ఈ దాససాహిత్యం కీర్తనల రూపమున ప్రవహించి భక్తుల హృదయములను హరిభక్తి సుధతో నింపినది.

ఇప్పటికి తెలిసినంతవరకు సంకీర్తన అనే సాహితీ ప్రక్రియను మాధ్యమంగా ఉపయోగించి, కన్నడభాషలో ధార్మిక జాగృతి కలిగించే హరిదాస వాఙ్మయమునకు ఆద్యుడు 13వ శతాబ్దానికి చెందిన నరహరి తీర్థులు. 13వ శతాబ్దం ఉత్తరార్థమందు నరహరితీర్థులతో జన్మించిన దాసకూటము యొక్క భక్తిమార్గపు సాహిత్యము 15వ శతాబ్ది చివరిలో ముందుకు సాగి 16వ శతాబ్దం మధ్యకాలమునకు పరాకాష్ఠమందు కొనుటయేగాక ఉన్నతమైన స్థానమును అధిరోహించెను.

“భక్తి బేకు, విరక్తి బేకు, శక్తి బేకు, ముందె ముక్తియ బయసువగె” (భవిష్యత్తులో ముక్తిని గోరు వారికి భక్తి, విరక్తి, శక్తి అనునవి యుండుట అవసరము) అను తత్వబోధన ఈ దాససాహిత్య ముఖ్యోద్దేశముగ నున్నది. సాళువ నరసింహుని కాలానికి

చెందిన శ్రీపాద రాయకవి కాలంలో (క్రీ.శ. 1404-1502) కన్నడ సాహిత్యంలో మరొక మైలు రాయిగా పేర్కొనదగిన దాస సాహిత్యం ప్రారంభమయింది. క్రీ.శ. 16వ శతాబ్దంలో దాస సాహిత్యమునకు ఈ ఔన్నత్యము వచ్చుటకు వ్యాసరాయలు, వాదిరాజులు, పురందరదాసులు, కనకదాసులు అను మహాత్ములు రచించిన భక్తి ప్రచారక కీర్తనలే కారణం. ఈ విధంగా అత్యున్నత దశనందుకున్న దాసాసాహిత్యం 17వ శతాబ్దిలో అజ్ఞాతంలో నుండుట గమనించదగిన విషయము.

క్రీ.శ. 17-18 శతాబ్దాలయందు విజయదాసులు, గోపాలదాసులు, మోహనదాసులు, ప్రసన్న వేంకటదాసులు, జగన్నాధదాసులు ఇత్యాది మహనీయదాస శ్రేష్టులు దాససాహిత్య పరంపరను వివిధ రీతులలో వెలుగొందించిరి. ఈ దాస పరంపరలో గురుగోపాలదాసులు, వరగోపాల దాసులు, వ్యాసవిఠలదాసులు, మహీపతిదాసులు, ప్రాణేశదాసులు, శ్రీపతి దాసుల వంటి మహనీయులెందరో రచనలు చేసి చిరస్మరణీయులైనారు.

క్రీ.శ. 18వ శతాబ్ది మధ్య భాగమునందు అనగా సుమారు 1750 సం॥లో హెళెవనకట్టె గిరియమ్మ అను బ్రాహ్మణకవయిత్రి శ్రీరంగనాథస్వామి అంకితముతో రచనలు చేసినారు. ఆ తర్వాత క్రీ.శ. 1801లో మొదల్‌కల్ శేషదాసులు, శ్రీ హరపనహళ్ళి భీమవ్వ (1822) శ్రీగురుజగన్నాధదాసులు (1853-1918) 19వ శతాబ్ది ఉత్తరార్ధానికి చెందిన శ్రీ అసిగ్యాళ గోవిందదాసులు, శ్రీశ్యామ సుందర దాసులు (1903-1956) కార్పరి నరహరిదాసులు (1896-1979) మొదలగువారు ప్రాతఃస్మరణీయులు.

ఈ విధంగా కర్ణాటక హరిదాసులు సర్వం త్యజించి, దాస వేషం ధరించి తంబూరను చిరుతలను చేతబట్టి భిక్షాపాత్రను పట్టుకొని వాడవాడలా సంచరిస్తూ భక్తి సంగీత ప్రచారం చేశారు. ఈ హరిదాసులందరు తిరుపతి వేంకటేశ్వరుని దర్శించి ఆయనను ప్రస్తుతిస్తూ అనేక కీర్తనలను రచించినారు. వేంకటేశ్వరస్వామిని స్తుతిస్తూ సంకీర్తన చేయని హరిదాసులేలేరని చెప్పవచ్చును. కర్ణాటక హరిదాస కూటమిలో దాదాపు 400 మంది హరిదాసులున్నారు.

ఈ విధంగా కర్ణాటక హరిదాస సాహిత్యం కన్నడకవులనే గాక ఆంధ్రదేశంలోని వాగ్గేయ కారుల్నికూడ ప్రభావితుల్ని చేసి సామాజిక చైతన్యంతో పాటు ధార్మిక జాగృతిని చాటి మానవజాతిని పునీతం చేసింది.

# శ్రీ నరహరి తీర్థులు

సమకాలీన ఆధారాలను మరియు కళింగ శాసనాధారాలను బట్టి శ్రీ నరహరితీర్థులు క్రీ.శ. 1250-1335 అవధిలో ఉన్నారని తెలుస్తోంది. కన్నడంలో కీర్తనలను వ్రాసి మధ్వతత్వాన్ని ప్రచారం చేసిన వారిలో మొదటివారు శ్రీ నరహరి తీర్థులు. హరిదాస కర్ణాటక ప్రక్రియకు నరహరితీర్థుల చేత అంకురార్పణ చేయబడినది.

నరహరి తీర్థులవారి పూర్వాశ్రమ నామము శ్యామశాస్త్రి వీరు గోదావరి తీరమందలి రాజమహేంద్రికి చెందినవారు బదరికాశ్రమమునుండి రాజ మహేంద్రికి శ్రీమధ్వాచార్యుల వారు వచ్చినప్పుడు వారితో శ్యామశాస్త్రి సిద్ధాంత వ్యాసమునకు తలపడెను. పరాజితులైన శ్యామశాస్త్రి అద్వైతము యెడల విముఖుడై ద్వైతమతోపదేశము పొందగోరెను. అంతట శ్రీమధ్వాచార్యులు తత్వోపదేశము చేసి ఆశ్రమాభిదానం చేసి "నరహరితీర్థులు" అని నామమిడిరి. వీరివలననే ఆంధ్రప్రదేశమున ద్వైతమతము వ్యాపించినది.

శ్రీమధ్వాచార్యులవారు నరహరితీర్థులకు ఆశ్రమము యిచ్చేముందు మీకు రాజ్యయోగం ప్రాప్తిస్తుంది, అందువల్ల మీకు ఆశ్రమం వద్దని చెప్పగా ఆశ్రమ స్వీకారానంతరం జగన్నాథపురం సంచారం చేయ షరతుపై నరహరి తీర్థులకు శ్రీమధ్వాచార్యులు ఆశ్రమాన్ని యిచ్చారు. ఆయన ఆజ్ఞమేరకు జగన్నాథపురం సంచారం వెళ్ళారు. అక్కడ రాజ్యాన్ని పాలిస్తున్న విష్ణుశర్మ మరణించగా మహారాణి గర్భవతిగా వుండుటవల్ల ఆరాజ్య సాంప్రదాయం ప్రకారం రాజావారి ఏనుగు ఎవరిమెడలో పూలమాలవేస్తే వారు రాజకుమారుడు పెద్దయ్యేవరకు రాజ్యపాలనచేయాలి. శ్రీనరహరి తీర్థులవారు పాఠ ప్రవచనం చేస్తుండగా ఆ ఏనుగు వచ్చి వారి మెడలో పూలమాల వేసింది. అపుడు మంత్రి విచ్చేసి మీరు రాజ్యపాలన చేయాలని కోరగా సన్యాసిని నేను రాజ్య పాలన చేయడమేంటి అని చెప్పి పశువు దాని కేమి తెలియును, ఎదురుగా ఎవరు కనపడితే వారి మెడలో దండవేస్తుంది. ఈసారి నేను గుహలో జపం చేస్తుంటాను. అపుడు మళ్ళీ మాల నామెడలో వేస్తే నేను అంగీకరిస్తానని చెప్పారు.

ఆ ఏనుగు మళ్ళీ నరహరి తీర్థులవారు జపం చేస్తున్న గుహ వద్దకు వెళ్ళి పూలమాల వారి మెడలో వేస్తుంది. ఈ విధంగా నరహరి తీర్థులవారు 18సం॥ల పాటు జగన్నాథపురంలో రాజ్య పాలన చేసినట్లు శ్రీకూర్మం సింహాచలం క్షేత్రాలలో శిలాశాసనాలు ఉన్నాయి.

అనంతరం నరహరితీర్థులవారు రాజ్యం అప్పగించి తిరిగి వస్తూండగా రాజకుమారుడు స్వామీ మీరు యిన్నాళ్లు మాకు చేసిన ఉపకారానికి కృతజ్ఞతాపూర్వకంగా మీకు ఏమికావాలో స్వీకరించండి అని కోరగా వారి ఆస్థానంలో పూజలేకుండావున్న మూలరామసీతా ప్రతిమలనడిగి వాటితో రాజ్యం దాటుతుండగా అగ్ని ప్రతిష్ఠితమైంది. అంత నరహరి తీర్థులు దాన్ని శాంతింపజేసి ఆ విగ్రహాలను శ్రీ మధ్వాచార్యుల వారికి సమర్పించిరి. ఈ విగ్రహాలు పూర్వము బ్రహ్మచే పూజితములైనవి.

రచనలు: యమకభారత వ్యాఖ్యనము, దేశోపనిషత్తులకు సూత్ర భాష్యములకు టీకా మొదలగు గ్రంథాలు, కీర్తనలు, ప్రస్తుతం వీరి కీర్తనలు రెండు మాత్రం లభ్యముగానున్నవి. వీటిని బట్టి వీరి రచనా వైశిష్ట్యాన్ని పూర్తిగా అవగాహన చేసికొనుట దుర్లభము. నరహరి – రఘుపతి అంకితనామంతో కీర్తనలు రచించినారు.

పూర్వాశ్రమంలో వీరు కూచిపూడి నాట్యపద్ధతికి సేవలందించిరి. ఉడిపి ప్రాంతంలో యక్షగాన ప్రక్రియకు రూపకల్పనచేసి ప్రచారం చేశారు.

శ్రీనరహరితీర్థులవారు 9సం॥ 1నెల 23రోజులు వేదాంత సామ్రాజ్యాధికారంచేసి (క్రీ.శ. 1333) శ్రీముఖ సం॥ పుష్యబహుళ సప్తమినాడు తుంగభద్ర తీరమున గల హంపీ (చక్రతీర్థం) క్షేత్రమందు బృందావనస్థులైరి.

# శ్రీ నరహరి తీర్థులు

రాగం: భూపాలం

శ్లో॥ ససీతామూలరామార్చా కోశే గజపతేఃస్థితా।
యేనానీతా నమస్తస్మై శ్రీమన్నృహరి భిక్షవే॥

## నరహరితీర్థుల రచనలు

రాగం: హిందోళ తాళం: ఆది

పల్లవి: ఇంతు మరుళాదెను నానెంతు మరుళాదె ॥ఇంతు॥

అనుపల్లవి: ఇంతు మరుళాగి మరుళాగి బయలిగె బీళువేనా
సంతత రక్షిసయ్యా రఘుకుల తిలక ॥ఇంతు॥

చ. 1. మాతినలి హరిదాసతన
నీతియలి ప్రధాదాసతన
భీతిబడువె విహితదలి ని
ర్భీతిలి మనెమనె తిరుగువెనో ॥ఇంతు॥

చ. 2. ఏకాంతదలి ధనదగోష్ఠి
లోకాంతదలి వైరాగ్యదవార్తె
శ్రీకాంతననేవెగనుమాన
భూకాంతన సేవెగె ఉత్సాహ ॥ఇంతు॥

చ. 3. ఎజిసు బ్రహ్మాదివందిత హరియ
త్యజిసు కామాది హగెగళన
సుజనవందిత సిరినరహరియ
భజసి బదుకు శ్రీరఘుపతియ ॥ఇంతు॥

రాగం: సింధుభైరవి తాళం: త్రిశ్రం

పల్లవి: తిళకో నిన్నొళగె నీనె మరుళె
తిళకో నిన్నొళగె నీనే ॥తిళకో॥

అనుపల్లవి: తిళకో నిన్నొళగె నీ
అళకో పోదాయాష్య
కళకో దుష్కర్మవన్ను విషయదిం
సెళకో ఇంద్రియగళన్ను స్వల్పారు
బెళసికో జ్ఞానవన్ను మరుళె ॥తిళకో॥

చ. 1. దాస నెందెనిసి ధనదాశయల్లి సర్వ
దేశవను సంచరిసి ముడుపిన
కాసుగళ సంపాదిసి నిజతను
జా–సతి–సుతాప్తర పోషిసి ఇద్దరె
ఘాసి యమనల్లి తప్పువదేనో హేసిమరుళె ॥తిళకో॥

చ. 2. సాదరది జనరింద అహదెనిసికొంబువదు
సాధారణ వల్లెందిగు చిత్తైసి
మోదదలి చరిసొ ఇందు కృషి పోష్య
వాదవృషభాదిగిందు ఈ ధర్మ
సాధిసదె అప్రాప్యవేనో ఒందు మరళె ॥తిళకో॥

చ. 3. భరత ఖండదొళు భూసుర జన్మసర్వజ్ఞ
వరశాస్త్ర దధికారవ కళకొళదె
చరమ సౌభాగ్యోద్భవ జ్ఞానదిం
విరకుతి మూలభావ పడెయో నీ
నరహరి రఘుపతియ ప్రేమ సుఖవామరుళె ॥తిళకో॥

# శ్రీపాదరాయులు



రాగం: కళ్యాణి

శ్రీపూర్ణోబోధ - గురుపూజిత - గోపీనాధ
బాహ్యాంతరాన వరతార్చన తత్పరాయ
శ్రీరంగవిఠ్ఠల - హయానన పూజకాయ
శ్రీపాదరాజ గురవేస్తు నమఃశుభాయ ॥

# శ్రీపాదరాయలు (1404-1502)

శ్రీపాదరాజ తీర్థుల పూర్వాశ్రమనామం లక్ష్మీనారాయణ జన్మస్థలం చెన్నపట్టణం తాలూకా కణ్వనదీ తీరమునందు గల అబ్బూరు. శేషగిరియప్ప, గిరియమ్మ వీరి తల్లిదండ్రులు. నిరంతరదైవభక్తి గల ఈయన లోకాలన్నిటికి శ్రీహరియే ప్రభువని, సర్వోత్తముడు శ్రీహరియేనని తన సహచరులకు బోధనలు చేయుచుండెడివారు. శ్రీస్వర్ణవర్ణతీర్థులు ఈయనకు ఆశ్రమ దీక్షనిచ్చిన గురువులు. ఒకసారి "శ్రీమన్న్యాయసుధ" లోని జటిలవిషయం చర్చకు రాగా ఈయన ఆ విషయాన్ని వేద ప్రమాణాల నుదహరిస్తూ అతి సులభంగా అర్థం చెప్పగా శ్రీరఘునాథ తీర్థులవారు ఈతని విద్వత్తుకు మెచ్చి "శ్రీపాదరాజులు" అన్న బిరుదునిచ్చి అభినందించిరి. ఆనాటి నుండి వీరు శ్రీపాదరాయలుగా ప్రసిద్ధినొందిరి. మహామహిమోపేతులు, తపస్సంపన్నులైన వీరి మహిమలను గూర్చి శ్రీవ్యాసరాయలవారు రచించిన శ్రీపాదరాజ పంచరత్నమాల' అను గ్రంథములో వ్రాయబడినది. సగటు మానవుడు అర్థం చేసు కోగలిగిన సరళమైన భాషతో వేదాంతరహస్యాలను, భక్తిని, ధర్మాన్నీ గీతాల రూపంలో గానం చేసే వినూత్న ప్రక్రియకు శ్రీపాదరాయులు నాందీ ప్రస్తాపకులయ్యారు. వీరి సంకీర్తనలు హరిదాస సాంప్రదాయానికి శ్రీకారం చుట్టాయి. కర్ణాటక రాష్ట్రంలోని "ముళబాగలు"లో కార్యస్థానం ఏర్పరచుకొన్న శ్రీపాదరాయలు వందలాది హరిదాసవరేణ్యుల ఆవిర్భావానికి కారకులయ్యారు. శ్రీపాదరాయలు "రంగవిఠల" అంకిత నామంతో కీర్తనారచన చేశారు. వీరి కాలంలో జన్మించిన హరిదాస సాహిత్య ప్రక్రియ తరువాతి కాలంలో అత్యంత వేగంగా కర్ణాటక దేశంలో వ్యాప్తి చెందినది. హరిదాస కూటాన్ని నిర్మించిన శ్రీవ్యాసరాయలు ఈయన ముఖ్యశిష్యులు. చంద్రగిరి రాజైన సాళువ నరసింహుని అనుగ్రహించి రత్నాభిషేకం చేయించుకున్న మహాతపస్వి ఈయన.

శ్రీపాదరాయలు సంస్కృత, కన్నడ భాషలలో మహాపండితులు. సంస్కృతంలో "వాగ్వజ్ర" అన్న వేదాంతగ్రంథాన్ని కన్నడంలో వందలాది కీర్తనలను రచించారు. ఈయన సాహిత్యంలో కీర్తన, సుళాది ఉగాభోగ, వృత్తనామ, దండక ప్రక్రియల్ని చూడవచ్చు కొన్ని కీర్తనలను నృత్య యోగ్యంగా రచించారు.

దాస సాహిత్యానికి మూలపురుషుడిగా కీర్తిగాంచిన శ్రీపాదరాయులు క్రీ.శ. 1502లో "ముళబాగలు" అనెడి పవిత్రస్థలంలో బృందావనస్థులయ్యారు.

# శ్రీపాదరాయులు రచన

రాగం: రాగమాలిక　　　　తాళం: ఆది

పల్లవి: పోపు హోగోణబారోరంగ॥
పోపు హోగోణబారో॥

చ. 1. జాహ్నవీయ తీరవంతె
జనకరాయన కువరియంతె
జానకీయ వివాహవంతె
జాణ నీ బరబేకంతె ॥పోపు॥

చ. 2. కుండినీయ నగరవంతె
భీష్మకన కువరియంతె
శిశుపాలన ఓల్లళంతె
ఓలెనినగె బరదెళంతె ॥పోపు॥

చ. 3. పాండవరు కౌరవరిగె
లెత్తవాడి సోతరంతె
రాజ్యవన్ను బిడబేకంతె
రంగవిఠల బరబేకంతె ॥పోపు॥

# శ్రీ వ్యాసరాయులు



రాగం: భైరవి

శ్లో॥ శ్రీమద్వ్యాసయతీంద్రాయ వైష్ణవేందీ వరేందవే

మత్తదుర్వాది మాతంగ మృగేంద్రాయ నమోస్తుతే॥

# శ్రీవ్యాసరాయలు (1447-1539)

శ్రీవ్యాసరాయలు కావేరీ తీరంలోని బన్నూరు గ్రామంలో జన్మించారు. ఈయనకు ఆశ్రమదీక్షయిచ్చిన గురువు శ్రీబ్రహ్మణ్యతీర్థులు, విద్యాగురువు శ్రీపాదరాయలు. మధ్వమతకీర్తిని నలుదిశల వ్యాపింపజేసిన ఘనత శ్రీవ్యాసరాయల వారికి దక్కింది. దేశ సంచారము చేయుచు శ్రీవ్యాసరాయల వారు పలుచోట్ల శ్రీప్రాణమూర్తి ప్రతిమలను ప్రతిష్ఠించిరి. ఈయన 12సం॥ల పాటు తిరుమలలో వుండి శ్రీనివాసునికి అనేక సేవలు సమర్పించారు. తిరుమల కొండ నెక్కుటకు ప్రయత్నించగా ఏడుకొండలు ఆదిశేష స్వరూపం గాను పర్వతమంతా సాలగ్రామంగాను కనిపించగా శ్రీవ్యాసరాయలవారు మోకాళ్లతోనే కొండెక్కి స్వామి పుష్కరిణిలోనే స్నానంచేసి శ్రీనివాసుని దర్శించిరి. ఇప్పటికి స్వామివారికి జరిగే సేవలలో కొన్ని వ్యాసరాయలు వారు ప్రవేశపెట్టినవేనని ప్రతీతి. శ్రీవ్యాసరాయలవారంటే శ్రీకృష్ణదేవరాయలకు అత్యంత భక్తి గౌరవం ఉండేవి. శ్రీకృష్ణదేవరాయలకు సంభవించిన కుహయోగాన్ని పరిహరించిన మహాతపస్వి ఈయన.

ఈయన మధ్వశాస్త్ర సంబంధమైన అనేక గ్రంథములను రచించిరి. సంస్కృతంలో తర్కతాండవ "న్యాయామృత" "చంద్రిక" మొదలైన ఎనిమిది వేదాంత గ్రంథాలను, కన్నడంలో వందలాది కీర్తనలను రచించారు. శ్రీకృష్ణదేవరాయల ముందూ తరువాత అయిదుగురు విజయనగర ప్రభువులకు రాజగురువుగా వ్యాసరాయలు భాసించారని సోమనాథ కవి రచించిన "వ్యాసయోగి విజయం"లో స్పష్టం చేయబడినది, పురందరదాసు, కనకదాసుల వంటి శిష్యులను పొందిన ధన్యజీవి ఈయన.

ప్రహ్లాదాంశ సంభూతులైన శ్రీవ్యాసరాయలు 92 సం॥లు జ్ఞాన ప్రచారం చేయుచూ సర్వస్వం శ్రీకృష్ణస్వరూపంగా భావించి లోకోపకారం చేసిన యతివరేణ్యులు. ఈయన అంకితనామం "శ్రీకృష్ణ" "కృష్ణ" "సిరికృష్ణ".

ఈయన క్రీ.శ. 1539లో అనెగొంది సమీపంలోని నవబృందావనగడ్డలో బృందావనస్థులయ్యారు.

# శ్రీ వ్యాసరాయల రచనలు

రాగం: కళ్యాణి　　　　　　　　　　　　　　　　తాళం: త్రిశ్రం

పల్లవి: కడగోల తారెన్న చిన్న మొసరు -
రొడెదరె బెణ్ణె బాహోదా　　　　　　　　　　॥కడగోల॥

చ. 1. అణ్ణన ఒడగూడి బారయ్యా సవి
బెణ్ణెయ ముద్దెయ మెల్లువిరంతె
బణ్ణద సరవన్ను కొరళల్లి హాకువె
చిణ్ణరొడనే ఆడహోగువియంతె　　　　　　　　॥కడగోల॥

చ. 2. పుట్ట బచ్చియ తందు నిన్నయ చిన్నద
తొట్టిల కాలిగె కట్టిసువె
బట్టలు తుంబిద సక్కరె నినగీవె
కట్టాణి ముత్తిన సరవనీవె　　　　　　　　　॥కడగోల॥

చ. 3. బడవర భాగ్యద నిధియే గోకులద ఎ -
న్నొడెయ మాణిక్యద హరళె
కడుముద్దు ఉడుపియ బాలకృష్ణయ్య
దుడుకు మాడువరేనో పెంగళొళురంగ　　　　　　॥కడగోల॥

# శ్రీవ్యాసరాయులు రచన

రాగం: కానడ                                                         తాళం: ఆది

పల్లవి: కాళింగానామెట్టి నాట్యవాడిద
కంజనాభ కృష్ణను॥

అనుపల్లవి: కాళింగనా మెట్టి ఆడిద భరదల్లి
శ్రీవత్స ఉరదల్లి కొరళల్లి వనమాలె
శ్రీతరళ తనదల్లి యమునెయ
మడువినల్లి ఆడుత్త పాడుత్త ॥కాళింగ॥

చరణం:1. కాలలిగెజ్జె ఘులుఘులు కెన్నె
ఫాలది తిలకవు హొళె హుళెముక్త
జ్వలితమణిమయ లలితపదకహార
జ్వలితకాంతి బెళగుత దిక్కుగళల్లి ॥కాళింగ॥

చరణం:2. సురరు దుందుభియ ధణధణధణరెందు
మొరెయె తాళగళు ఝణఝణఝణరెందు
హరబ్రహ్మసురరు తద్దైవతద్దైవతద్దైవ ఎనలు
నారదతుంబురు సిద్ధరు విద్యా
ధరరు అంబరదల్లి ఆడుత్త పాడుత్త ॥కాళింగ॥

చరణం:3. యోగిగళెల్ల జయజయజయవెన్నె
భోగిగళెల్ల భయభయభయవెన్నె
నాగకన్యెయరు అభయఅభయవెన్నె
నాగశయన సిరికృష్ణ జననియకండు
బెగనె బిగిదప్పి ముద్దను తోరిద ॥కాళింగ॥

# శ్రీవ్యాసరాయులు రచన

రాగం: కాపీ　　　　　　　　　　　　　　　　　　　　　తాళం: త్రిపుట

పల్లవి: మహిమె సాలదె ఇష్టె మహిమె సాలదె
అహిశయనన ఒలిమెయింద
మహియొళెమ్మ శ్రీపాదరాయర ॥మ॥

చరణం 1. ముత్తిన కవచ మేల్కులావి
రత్న కెత్తిద కర్ణకుండల
కస్తూరి తిలక శ్రీగంధలేపన
విస్తారదింద మెరెదు బరువ ॥మ॥

చరణం 2. విప్రగె బ్రహ్మహత్య దోషబరలు
క్షిప్ర శంఖోదకది కళెయె
అప్ర బుద్ధరు దూషిసె గేరణ్ణె
కప్పు వసన హసన మాడిద ॥మ॥

చరణం 3. హరిగె సమర్పిసిద నానా
పరియ శాకంగళను భుంజిసె
నరరు నగలు శ్రీశకృష్ణన
కరుణదింద హసియ తోరిద ॥మ॥

# శ్రీవాదిరాజులు



రాగం: ఆరభి

శ్లో॥ తపోవిద్యా విరక్త్యాది సద్గుణౌఘా కరానహం

వాదిరాజగురూన్వందే హయగ్రీవ సదాశ్రయాన్॥

# శ్రీవాదిరాజులు (1480-1600)

దక్షిణ కర్ణాటక మండలంలోని కుంభాసి సమీపంలోని "హువినకెరె" గ్రామం శ్రీవాదిరాజుల వారి జన్మస్థలం. శ్రీమధ్వాచార్యుల వారిచే స్థాపించబడిన ఉడిపి అష్టమఠములలో ఒకటైన స్వాది మఠమునకు చెందిన శ్రీవాగీశతీర్థుల వారి సంరక్షణలో పెరిగి విద్యాభ్యాసము చేసిన అసాధారణ విద్యా ప్రవీణులు శ్రీవాదిరాజస్వామివారు.

శ్రీవాదిరాజులు మహాతపశ్శాలి. పరవాదులను అందరిని జయించుట వలన వీరికి వాదిరాజస్వామి అని పేరువచ్చెనని ప్రతీతి. శ్రీవాదిరాజులు భూ ప్రదిక్షణము చేసి నాలుగు దిక్కులందున్న పుణ్య తీర్థములను వర్ణించుచూ "తీర్థప్రబంధమను" గ్రంథమును రచించెను. హయగ్రీవ రూపములోనున్న శ్రీవారిని ప్రత్యక్షీకరించుకొనిన మహానుభావులు ఈయన. శ్రీవాదిరాజులు బదరికాశ్రమము నుండి త్రివిక్రమమూర్తి విగ్రహమును, రథరూప దేవాలయమును క్రీ.శ. 1505లో స్వాది గ్రామమునందు ప్రతిష్టించి గుడి కట్టించినట్లు శిలాశాసనమున్నది. శ్రీగోపాలకృష్ణ, హనుమత్ప్రతిమలను కూడ వాదిరాజులు ప్రతిష్టించిరి. మరియూ ధవళగంగ, శీతలగంగ మొదలైన పంచగంగలను నిర్మాణము చేసిరి.

శ్రీకృష్ణ దేవరాయల చేత "ప్రసంగాభరణతీర్థ" అని ప్రశంశించబడిన ప్రతిభాశాలి ఈయన.

సంస్కృతంలో "యుక్తిమల్లికా" మొదలైన అనేక వేదాంత గ్రంథాలనూ, "రుక్మిణీవిజయము" అన్న అపూర్వకావ్యాన్ని సుమారు 50 స్తోత్రాల్నీ, కన్నడంలో వందలాది పదాలనే కాకుండా "వైకుంఠవర్ణనె" "లక్ష్మీశోభనె" "స్వప్నపద" "గుండక్రియె" "కేశవనామ" "కీచకవధె" అనేక కృతులను, సుళాది ఉగాభోగలును వ్రాసియున్నారు. "హయవదన" వీరి అంకితనామం.

క్రీ.శ. 1600లో "సోదె" యందు సశరీరంగా బృందావన ప్రవేశం చేశారు.

## శ్రీవాదిరాజుల రచన

రాగం: మిశ్ర చక్రవాకం తాళం: ఆది

పల్లవి: దారియెతోరో గోపాల
వారిజనాభ వైకుంఠలోల ||దా||

చరణం 1. సిక్కిదె భవపాశదోళగె
లెక్క విల్లద జంతుగళిగె
దిక్కొబ్బరిల్లవో ఎనగె
కక్కస కళెదు నిన్నియ పాదగళిగె ||దా||

చరణం 2. అజరుద్రాది గళందు
గజరక్షక నీనెందు
నిజవాగి పేళిదరెందు
సుజన రొడెయెనె కేళిదె నానిందు ||దా||

చరణం 3. సిరిహయవదననె బార్రై
కరెదెన్న దారియతోర్రై
పరమభక్తరిగె ఇన్నార్రై
పరమపురుష నీనల్లదె గతియార్రై ||దా||

# శ్రీవాదిరాజుల రచన

రాగం: కళ్యాణి　　　　　　　　　　　　తాళం: త్రిశ్రం

పల్లవి: ముద్దుముఖదాత నమ్మ ముఖ్య ప్రాణనాథనో
సద్గుణవందిత వాయుజాతనో రామదూతనో ||ము||

చరణం 1. జానకీశన వైరిశూలనో (శూలనో) బహుధీరనో
మానిని సీతెయకండు బందనో ముందెనిందనో ||ము||

చరణం 2. వానరరూపిలి ముద్రికె ఇత్తనో (ఇత్తనో) వనకిత్తనో
ఆనగరవనెల్ల సుట్టనో (సుట్టనో) బహుధిట్టనో ||ము||

చరణం 3. సాగరవను దాటిదధీరనో (ధీరనో) రణధీరనో
రాగతాళమేళదల్లి జాణనో ప్రవీణనో ||ము||

చరణం 4. నంబిద భక్తర కాయువ దాతనో (దాతనో) ప్రఖ్యాతనో
అంబుజాసనపదకె బందు నింతనో. హనుమంతనో ||ము||

చరణం 5. హయవదనన భక్తచెల్వ తేజనో (తేజనో) యతిరాజనో
మాయిగళ కులకె బలు భీమనో (భీమనో) సార్వభౌమనో ||ము||

రాగం: కళ్యాణి తాళం: త్రిపుట

పల్లవి: శరణు శరణు

చరణం 1: శరణు శ్రీవైకుంఠనాయక
శరణు శ్రీ పురుషోత్తమ
శరణు శ్రీధర గరుడవాహన
శరణు వేంకటనాయక ॥శ॥

చరణం 2: ఆదిదేవ మునీంద్రవందిత
సాధుసురగణ సేవిత
వేదవేద్య విరించిసన్నుత
శ్రీద వేంకటనాయక ॥శ॥

చరణం 3: శరణు సురముని హృదయపాలక
శరణు భక్తర రక్షక
శరణు శ్రీహయవదన మౌక్తిక
శరణు ఓంకారనామక ॥శ॥

రాగం: ఆనందభైరవి తాళం: ఆది

పల్లవి: వేణునాదప్రియ గోపాలకృష్ణ
వేణునాద వినోదముకుంద
గానవినోద శృంగారగోపాల ॥వేణు॥

చరణం 1: వందిత చరణా వసుధేయాభరణా
ఇందిరారమణా ఇనకోటితేజా
మందరధర గోవింద ముకుంద
సింధుశయన హరి కందర్పజనక ॥వేణు॥

చరణం 2: నవనీతచోర నందకుమార
భువనైకవీర బుద్ధివిస్తార
రవికోటితేజ రఘువంశరాజా
దివిజవందిత దనుజారి గోపాల ॥వేణు॥

చరణం 3: పరమదయాళు పావనమూర్తి
వరకీర్తిహార శృంగారలోల
ఉరగేంద్రశయన వరహయవదన
శరణరక్షక పాహి కోదండరామ ॥వేణు॥

# శ్రీరాఘవేంద్రతీర్థులు



రాగం: చక్రవాకం

శ్లో॥ పూజ్యాయ రాఘవేంద్రాయ సత్యధర్మ రతాయచ

భజతాం కల్పవృక్షయ నమతాం కామధేనవే॥

# శ్రీరాఘవేంద్రులు

శ్రీరాఘవేంద్రస్వామి వీణావిద్యలో ప్రవీణులైన కృష్ణభట్టువంశంలోనివారు. వీరి జన్మస్థలము బళ్ళారి జిల్లా విజయనగరము. వీరి తల్లిదండ్రులు తిమ్మనబట్టు, గోపికాంబ. తిరుపతి శ్రీనివాసుని కటాక్షముచే వెంకన్నభట్టుగా వారికి క్రీ.శ.1601లో జన్మించిరి. యుక్తవయస్సు రాగానే సరస్వతి అనునామెతో వివాహం జరిగెను. సుధీంద్రులవద్ద కుంభకోణములో విద్యనభ్యసించిరి. విద్యాభ్యాసము ముగిసిన వెంటనే సుధీంద్రులవారు వెంకన్నభట్టుని సన్యాసాశ్రమము తీసుకొనవలసినదిగా ఆజ్ఞాపించిరి నీవు సజ్జనోద్ధరణకు అవతరించియున్నావు, కాబట్టి ఆశ్రమ స్వీకారం చేసి టిప్పణి గ్రంధములను రచించవలెనని చెప్పిరి. వీరు గురువుల ఆజ్ఞమేరకు ఆశ్రమ స్వీకారంచేసిరి. సుధీంద్రులువారు వెంకన్నభట్టుకు రాఘవేంద్రతీర్థులని నామకరణమొనర్చిరి.

శ్రీరాఘవేంద్రస్వామివారు దేశసంచారము గావించుచూ పరవాదులతో వాదనచేసి జయపత్రికలను సంపాదించిరి. మధ్వ శాస్త్రమునకు పెక్కు టీకలను రచించిన శ్రీరాఘవేంద్రతీర్థులు తమ జీవిత కాలమున నలుబది ఏడు గ్రంధములను రచించిరి.

వేదత్రయ వివృత్తి, మంత్రార్థమంజరి, పురుషసూక్తాది పంచసూక్తవ్యాఖ్య, దశోపనిషత్ఖండార్థములు, గీతార్థసంగ్రహము, ప్రమేయ దీపికా వ్యాఖ్యనము, గీతాతాత్పర్యటీకా వివరణము, తంత్రదీపిక, న్యాయముక్తావళి, తత్వమంజరి, పరిమళ, దశప్రకరణటీకావ్యాఖ్య, రామచరిత్రమంజరి, తాత్పర్య నిర్ణయ భావనసంగ్రహము, చంద్రికా ప్రకాశ, తర్కతాండవ వ్యాఖ్య, ప్రమాణ పద్ధతి వ్యాఖ్య, భాట్టసంగ్రహము మొదలగునవి. వీరికి గీతము సంగీతము ఎంతో ప్రియమైనవి. వీరి మహిమలు అనంతమైనవి.

ప్రహ్లాదాంశ సంభూతులైన శ్రీరాఘవేంద్రులు తమ 70వ ఏట 1671 విరోధికృతనామ సంవత్సర శ్రావణ బహుళ విదియనాడు తుంగభద్రానదీ తీరమందలి మంత్రాలయ క్షేత్రమున బృందావనస్థులైనారు.

# శ్రీరాఘవేంద్రుల రచన

రాగం: షణ్ముఖప్రియ　　　　తాళం: ఆది

పల్లవి: ఇందు ఎనగె గోవింద
నిన్నయ పాదారవిందవతోరో ముకుంద ఇందిరేరమణ ||ఇందు||

సుందరవదననె నందగోపనకంద
మందరోద్ధర అరవిందలోచన ||ఇందు||

చరణం 1: నొందెనయ్య భవబంధన దొళుసిలుకి
ముందెదారి కాణదె కుందిదె జగదొళు
కందనెంతెందన్న కుందుగళెణిసదె
తందెకాయోకృష్ణ కందర్పజనకనె ||ఇందు||

చరణం 2: మూఢతనదిబలు హేడిజీవననాగి
ధృడభక్తియను మాడవిల్లవో హరియె
నోడలిల్లవోనిన్న పాడలిల్లవో మహిమె
గాడికారకృష్ణ బేడికొంబెనోస్వామి ||ఇందు||

చరణం 3: ధారుణియొళు బలుభార జీవననాగి
మేరె తప్పి నడెదె సేరిదె కుజనర
ఆరు కాయువరిల్ల సారిదె నినగయ్య
ధీరవేణుగోపాల పారుగాణిసొ స్వామి ||ఇందు||

# శ్రీవ్యాస తత్త్వజ్ఞతీర్థులు

శ్లో॥ రాగం: సింహేంద్రమధ్యమం

ప్రకటీకృత టీకోర్తిర్మర్కటీకృత మాయిరాట్
చక్రతాత్ వ్యాస తత్త్వజ్ఞః మస్కరీంద్రః కృపాంమయ॥

## శ్రీవ్యాస తత్త్వజ్ఞతీర్థులు (1740-1800)

శ్రీవ్యాసతత్త్వజ్ఞతీర్థులవారి పూర్వాశ్రమనామం ఐ.జి. వెంకటరామాచార్యులు వీరు గోపాలదాసులు వారియొక్క సమకాలీకులు. వీరు తండ్రివద్ద విద్యనభ్యసించారు. వీరు ముఖ్యప్రాణదేవరభక్తులు. వీరి ఉపదేశ గురువు శ్రీభువనేంద్రతీర్థులు. వీరు స్వప్నంలో "వాసుదేవవిఠల" అంకితం పొందారు. వీరు "మానసస్మృతి" అను గ్రంథం, భాగవత సప్తమస్కంధానికి వాఖ్యానం, అనేక సుళాదులు, ఉగాభోగలు రచించారు.

శ్రీవ్యాసతత్త్వజ్ఞతీర్థులు శ్రావణబహుళ అష్టమినాడు వేణిసోంపురంలో బృందావనస్థులయ్యారు.

# శ్రీవ్యాసతత్త్వజ్ఞతీర్థుల రచన

రాగం: పహాడి తాళం: ఆది

పల్లవి: బందకృష్ణ చందిదింద బందనోడె గోప
వృందదింద నందిసుత బందనోడె ||బం||

చరణం1: గోవమేవ నీవదేవ బందనోడె
దేవతావాద్యగళింద బందనోడె ||బం||

చరణం 2: పాపపోప గోపరూప బందనోడె
తాపాలేప కోపాలేప బందనోడె ||బం||

చరణం 3: భూసురసుఖసూసుత బందనోడె
వాసుదేవ విఠల తా బందనోడె ||బం||

# శ్రీపురందరదాసులు



రాగం : కళ్యాణి

శ్లో॥ మన్మనోభీష్ట వరదం సర్వాభీష్ట ఫలప్రదం

పురందర గురుం వందే దాసశ్రేష్టం దయానిధిం

# శ్రీపురందరదాసులు

"దురిత వ్రాతము లెల్లను
పరిమార్చెడి హరి గుణముల పాడుచునెపుడున్
పరవశుడై వెలయ
పురందరదాసుని మహిమలను తలచెద మదిలోన్"

అని వాదోపాసనతో ముక్తి పొందిన త్యాగరాజు తన ప్రహ్లాద భక్త విజయములో పురందరదాసుని పొగిడినారు. "దాసరందరే పురందరదాసరయ్యా" అని తన గురువు వ్యాసరాయల పొగడ్తకు పాత్రుడైన మహనీయుడు పురందరదాసులు.

పురందరదాసు జీవితకాలం 1480-1564 అని పలువురి అభిప్రాయం. ఈయన జన్మస్థలం పంఢరాపురము సమీపంలోని "పురందరఘడ" ఈనాడు ఇది మహారాష్ట్రంలో ఉన్నా పూర్వం కర్ణాటక రాజుల పరిపాలనలో వుండేది.

పురందరదాసు అసలు పేరు శ్రీనివాసనాయకుడు లేక శీనప్ప. శ్రీవ్యాసరాయలువారి ఉపదేశం పొంది "పురందరవిఠల" అనే ముద్ర తో పదరచన చేయడంవల్ల పురందరదాసు అనే పేరు సార్ధకమైంది.

ఒక పర్యాయం శ్రీకృష్ణదేవరాయలు పురందరదాసునకు కానుకలనిచ్చి, సత్కరించారు. వాటిమీద మోహంలేని పురందరదాసు వాటిని నిరుపేదలకు దానం చేసినారు. దానికి కారణం తెలియని రాయలవారు పురందర దాసుని తన ఆస్థానానికి ఆహ్వానించి, తాను పంపిన కానుకలు బహుశా పురందరదాసునకు సంతృప్తి నివ్వలేదేమోనన్న సందేహాన్ని వెలిబుచ్చారట. సర్వసంపదలతో "నవకోటినారాయణ" బిరుదు వహించిన తాను వాటినన్నింటిని వదిలి నిరుపేదగా మారడంలోని ఆంతర్యాన్ని రాయలు వారికి వివరిస్తూ "నీభాగ్యం గొప్పదో, నాభాగ్యం గొప్పదో సరి చూసుందాంమరి" అని అర్థం వచ్చేటట్లు రాయలువారితో సవాలు చేస్తూ పదరచనచేసి పాడి వినిపించి తన ఔన్నత్యాన్ని చాటుకొన్నారు. అది విని అమితానంద భరితుడైన శ్రీకృష్ణదేవరాయలు పురందరదాసుని పురందర అవతారంగా భావించి సత్కరించెను. ఈయన తిరుపతిలో సంకీర్తనా చార్యుడిగా ప్రసిద్ధి పొందిన అన్నమాచార్యుని సందర్శించి శ్రీవేంకటేశ్వరునిగా భావించి కీర్తించారట.

ఈయన కీర్తనలలో నవవిధ భక్తులు – శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం మరియు ఐదు పరమభావాలు – మధుర, వాత్సల్య సఖ్య, సేవ్య, శాంతమనే భావాలున్నాయి. పురందరదాసునకు కర్ణాటక సంగీత పితామహుడనే బిరుదు కలదు. ఈయన సుమారు 70–80 రాగాలు వాడినట్లు ప్రతీతి. సంగీత శిక్షణను సులభతరం చేసిన ప్రసిద్ధ వాగ్గేయకారుడు పురందరదాసు నారదాంశ సంభూతుడని ప్రతీతి. ప్రస్తుతం కర్ణాటక సంగీతంలో ప్రచారంలో వున్న 35 తాళముల పద్ధతిని చేసి ఆ తాళములందు సూళాదులు వ్రాసి ప్రచారం చేసారు. విశేష భక్తిరాగాలైన శంకరాభరణం, కళ్యాణి, తోడి, భైరవి మొదలైన రాగాలలో ఆయన కృతులు చేశారు. పురందర దాసులవారి "పురుందరోపనిషత్" నకు వేదనోపనిషత్తులలో తుల్య గౌరవం ప్రతిపాదించబడినది.

ఈయన మానవసేవయే మాధవసేవగా భావించి మానవులంతా ఒక్కటే అను సత్యాన్ని లోకానికి చాటి చెప్పిన మహనీయ గుణ సంపన్నుడు.

పురందరదాసు 4,75,000 పదాలు రచించారు. ఆయన తన కీర్తనలలో తాను సందర్శించిన స్వాములపైన, స్థలపురాణాలపైన అసంఖ్యాకంగా కీర్తనలను చేసారు. ఈ క్రింది పట్టిక ననుసరించి ఆయన ఏఏ విషయములపైన ఎన్నెన్ని కీర్తనలను చేశారో విదితమవుతుంది.

| | |
|---|---|
| కేదారం నుండి రామేశ్వర పర్యంతం వరకు గల | |
| తీర్థముల వర్ణనలు | 1,25,000 |
| ఆచార్యుల గురుమహిమల వర్ణనలు | 5,000 |
| బ్రహ్మాది సర్వలోక వర్ణనలు | 90,000 |
| పురాణ కథాసారాలు | 90,000 |
| దేవతామూర్తుల ధ్యాన కళ్యాణ చరిత్రలు | 60,000 |
| శ్రుతి, స్మృతి, సంహిత ధర్మ ప్రతిపాదకాలు | 16,000 |
| సుళాదులు | 64,000 |
| దేవనామాలు, ఉగాభోగాలు | 25,000 |
| | 4,75,0000 |

# పురందరదాసులవారి కొన్ని ముఖ్యమైన కీర్తనలు

"హలెయ హరగిహనె ఉరొళగిల్లవె" - ఇందులో అంటరాని తనమును గురించి తర్కించి యున్నారు.

"నగెయబరుతిదె" - ఇందులో ఒట్టి వేషధారిగా ఉంటే చాలునా. స్త్రీ, పురుషులు తప్పుడు దోవలో వ్యవహరిస్తూన్నారని చమత్కరించారు.

"కేళనో హరితాళనో" సంగీతం గురించి చెప్తూ భక్తి శ్రుతి లయలేనిది సంగీతమే కాదని చెప్పియున్నారు.

"పిండాండదొళగిన" - అను కృతిలో మూలాధారాది షట్చక్ర వివరమును, అధస్సహస్రారం, సహస్రారం యొక్క విశిష్టతను వర్ణించియున్నారు.

యావద్భారతదేశంలో ఎవరూ ఇన్ని రచనలు చేయలేదు. కీర్తనా పద్ధతిని ఉద్ధరించి మానవ జీవితాన్ని సముద్ధరించిన మహామహితాత్ముడు.

పురందరదాసు హంపీలోని ఒక మంటపంలో చాలాకాలం నివసించడం వల్ల దానికి పురందరమంటపము అని పేరు వచ్చింది. పురందరదాసు రక్తాక్షినామ సం॥ర పుష్య బహుళ అమావాస్యనాడు దేహత్యాగం చేశారు.

# శ్రీ పురందరదాసుల రచనలు

రాగం: మోహన | తాళం: ఆది

పల్లవి: అళువుదేతకోరంగ అళువుదేతకోరంగ
అళువుదేతకోరంగ అత్తరంజిపగుమ్మ ||అ||

చరణం 1: పుట్టిదేళుదివసదలి దుష్టపూతనియకొందె
ముట్టివిషద మొలెయుండ కారణ దృష్టి తాకితె
నెనిగె రంగయ్య ||అ||

చరణం 2: బాలకతనదల్లి గోపాలకరొడగూడి
కాళియమడువను కలకిదకారణ
కాలుఉళుకితె నినెగె రంగయ్య ||అ||

చరణం 3: శరణు వేలాపురద దొరెయె చెన్నిగరాయ
శరణర సలహువ కరుణానిధియే
వరదపురందర విఠలరాయ ||అ||

రాగం: కాపీ తాళం: ఆది

పల్లవి: ఇదు భాగ్య విదుభాగ్య విదు భాగ్యవయ్య
పదుమనాభనపాదభజనె సుఖవయ్య ॥ఇదు॥

చరణం 1: కల్లాగి ఇరబేకు కరిణభవతొరెయొళగె
బిల్లాగి ఇరబేకు బల్లవరొళు
మెల్లనె మాధవన మనవమెచ్చిసబేకు
బెల్లవాగిరబేకు బల్లవరొళగె ॥ఇదు॥

చరణం 2: బుద్ధియలి తను మనవ తిద్ది కొళ్ళలు బేకు
ముద్దాగిఇరబేకు మునియోగిగళిగె
మధ్వమతాబ్ధియొళు మీనాగిరలు బేకు
శుద్ధనాగిరబేకు కరణత్రయగళింద ॥ఇదు॥

చరణం 3: విషయభోగద త్రుణక్కె ఉరియాగిరలుబేకు
నిశిహగలు శ్రీహరియ నెనెయబేకు
వసుధీశపురందరవిఠలరాయన
హసనాద దాసరను సేవిసలు బేకు ॥ఇదు॥

రాగం: కాపీ తాళం: ఆది

పల్లవి: ఇన్నుదయబారదె దాసనమేలే ||ఇ||

పన్నంగశయన పాల్గడలొడెయనె రంగ ||ఇ||

చరణం 1: నానా దేశగళల్లి నానా కాలగళల్లి
నానా యోనిగళల్లి ఆళిదు పుట్టి
నాను నన్నదు ఎంబ నరకదొళగె బిద్దు
నీనే గతియెందు నంబిద దాసనమేలే ||ఇ||

చరణం 2: కామాది షడ్వర్గ గాడాంధకారది
పామరనాగిద్ద పాతకను
శ్రీమనోహరనె చిత్తజ జనకనె
నామముద్రికెయింద నంబిద దాసనమేలే ||ఇ||

చరణం 3: మనసావాచా కాయది మాళ్పకర్మవు
దానవాంతక నిన్నాధీనవల్లెరంగ
ఏనుమాడిదరేను ప్రాణనిన్నదుదేవ
శ్రీనాథ పురందర విఠల దాసన మేలే ||ఇ||

రాగం: హంసానంది తాళం: ఆది

పల్లవి: ఇదు ఏనంగ మోహనాంగ

అను పల్లవి: మదనజనక తొరవెయ నరసింగ॥

చరణం 1: సురరును తిసిదరె తుటియమిసుకదవ
మరెదేతకె బాయ తెరదె పేళొమ్మె॥

చరణం 2: వరనీలముత్తు మాణిక్య హారగళిరె
కొరళల్లి కరుణమాలెయ నిట్టు మెరెవుదు ॥ఇదు॥

చరణం 3: తొరవెయ నరహరి పురందరవిఠల
శిరియప్ప తొడెయొళు అరియనిట్టరివుదు ॥ఇదు॥

రాగం: రాగమాలిక తాళం: ఆది

పల్లవి: ఏళయ్య బెళగాయితు ఏళునారాయణా॥

అనుపల్లవి: ఏళు నారాయణ ఏళు లక్ష్మీరమణ
ఏళు శ్రీగిరియొడెయ వేంకటేశా ॥ఏ॥

చరణం 1: దాసరెల్లరు బందు ధూళి దర్శనగొందు
లేసాగి తాళదండిగెయ పిడిదు
కేశవనె నిమ్మ సిరినామవను స్మరిసుతలి
వాసుదేవనే ఉదయదలి పాడుతిహరు ॥ఏ॥

చరణం 2: కాసిద్ధ హాలుగళ కావడియ తుంబిట్టు
లేసాగి కెనెమొసరు బెణ్ణెయనె మెద్దు
శేషశయననె ఏళు సముద్ర మథనవమాడు
దేశకెంపాయితెళయ్య హరియె ॥ఏ॥

చరణం 3: అరళుమల్లిగె – బాజి – పరిమళదపుష్పగళ
సురరు తందిహరయ్య సుజన రొడెయ
అరవిందలోచననే కోళి కూగితుకేళు
పురందరవిఠలనె బెళగాయితు ॥ఏ॥

రాగం: హిందోళ　　　　　　　　　　　　　　తాళం: ఆది

పల్లవి: ఓడిబారయ్య వైకుంఠపతి నిన్న
నోడువె మన దణియె ||ఓ||

అను పల్లవి: నోడి మాతాడి ముద్దాడి సంతోషగూడి
పాడి పొగుళువెనొ పరమపురుష హరి ||ఓ||

చరణం 1: కెందావరె పొల్వ పాదగళింద రంగ
ధిమిధిమిధిమి కెందు కుణియుతలీ
అందుగె కిరుగెజ్జె ఘులుఘులురెన్నలు
చందది పీతాంబర నలిదాడలు ||ఓ||

చరణం 2: కోటి సూర్యప్రకాశదంతె కి
రీట - కుండల - బావులి - హొళెయె ల
లాటకస్తూరితిలక ఇడువెరంగ
కూటగోపాలర ఆట సాకొ ఈగ ||ఓ||

చరణం 3: మంగళాత్మక మోహనకాయరంగ
సంగీతలోల సద్గుణశీల
అంగనెయరిగెల్ల అతిప్రియనాధ శుభ
మంగళ మారుతి పురందరవిఠల ||ఓ||

రాగం: మోహన తాళం: ఆది

పల్లవి: కళ్యాణం తులసి కళ్యాణం
కళ్యాణవెనమ్మ కృష్ణ శ్రీతులసిగె ॥క॥

అను పల్లవి: బల్లిద శ్రీవాసుదేవనిగె ॥క॥

చరణం 1: అంగళదొళగెల్ల తులసివనమాడి
శృంగారవమాడి శ్రీప్రభుదింద
కంగళపాపవ పరిహరిసువముద్దు
రంగ బందల్లి నెలసిహను ॥క॥

చరణం 2: మిందు మడియనుట్టు సందేహవబిట్టు
తందశ్రీ గంధాక్షతె గళింద
సింధుశయనన వృందావనది పూజిసె
కుందదభాగ్యవ కొడుతిహళు ॥క॥

చరణం 3: ఉత్థాన ద్వాదశి దివసదల్లి
ఉత్తమ తులస్సిగె వివాహవ
చిత్తనిర్మలరాగి మాడిదవరిగె
ఉత్తమగతి ఈవ పురందరవిఠల ॥క॥

రాగం: మోహన తాళం: త్రిశ్రం

పల్లవి: కాయలారెనో కృష్ణా కండవర బాగిలను
నాయికున్నియ తెరది పరర పీడిసుత ||కా||

చరణం 1: ఉదయకాలదలెద్దు సంధ్యావిధియ బిట్టు
పదుమనాభనపాద సేవెయనుమాడదె
ముదదినిన్నర్చిసదె నరర సదనవహొక్కు
ఒదిగి సేవెయెమాడి అవరబాగిలను ||కా||

చరణం 2: కల్లకరగిస బహుదు కడలె హురిగడలెయెళు
తైలవను తెగెదాదరుణ్ణబహుదు
బల్లిదర మనవ మెచ్చిసలారె ప్రతిదినది
హల్లుగిరిగిరిదు హంబలిసి బాయబిడుత ||కా||

చరణం 3: ఇంతు నానాచింతెయొళు నిన్న నెనెయదలె
భ్రాంతియెంతెంబ హెబ్బలెయొళు సిలుకి
అంత్యదారియకాణె ఆదరిసువరు ఇల్ల
చింతెయను బిడిసయ్యా పురందర విఠల ||కా||

రాగం: రాగమాలిక తాళం: త్రిశ్రం

పల్లవి: కూసిన కండీర్యా ముఖ్య ప్రాణన కండీర్యా
బాలన కండీర్యా బలవంతన కండీర్యా ||కూ||

చరణం 1: అంజని ఉదరది హుట్టితు కూసు
రామన చరణకె ఎరగితు కూసు
సీతెగె ఉంగుర కొట్టితు కూసు
లంకాపురవనె సుట్టితు కూసు ||కూ||

చరణం 2: బండి అన్నవ ఉండితు కూసు
బకన ప్రాణవ కొండితు కూసు
విషదలడ్డిగె మెద్దితు కూసు
మడదిగె పుష్పవ కొట్టితు కూసు ||కూ||

చరణం 3: మాయావాదిగళ గెద్దితు కూసు
ద్వైతమతవనుద్ధరిసితు కూసు
మధ్వరాయరెంబ వెసరిన కూసు
పురందరవిఠలన ప్రేమద కూసు ||కూ||

రాగం: కళ్యాణి | తాళం: ఆది

పల్లవి: గజవదన బేడువే గౌరీతనయ
త్రిజగవందితనె సుజనర పొరెవనె ||గ||

చరణం 1: పాశాంకుశధర పరమపవిత్ర
మూషికవాహన మునిజనప్రేమ ||గ||

చరణం 2: మోదది నిన్నయ పాదవతోరో
సాధువందితనె ఆదరిదిందలి ||గ||

చరణం 3: సరసిజనాభ శ్రీపురందర విఠలన
నిరుతనెనెయువంతె దయామాడో ||గ||

రాగం: బృందావనసారంగి | తాళం: ఆది

పల్లవి: జయజానకీకాంత జయసాధువినుత
జయతు మహిమానంత జయభాగ్యవంత ||జ||

చరణం 1: దశరథాత్మజ వీర దశకంఠ సంహార
పశుపతీశ్వరమిత్ర పావనచరిత్ర
కుసుమబాణస్వరూప కుశలకీర్తికలాప
అసమసాహస శిక్ష అంభుజదళాక్ష ||జ||

చరణం 2: సామగానవిలోల సాధుజనపరిపాల
కామితార్థ ప్రదాత కీర్తిసంజాత
సోమసూర్యప్రకాశ సకలలోకాధీశా
శ్రీమహారఘువీర సింధుగంభీర ||జ||

చరణం 3: సకలశాస్త్ర విచార శరణజనమందార
వికసితాంబుజవదన విశ్వమయసదన
సుకృతమోక్షాధీశా సాకేతపురవాస
భక్తవత్సలరామ పురందరవిఠల ||జ||

రాగం: మిశ్రమోహన తాళం: ఖండం

పల్లవి: జయమంగళం నిత్యశుభమంగళం

చరణం 1: సచ్చిదానంద సర్వగుణపూర్ణగె
అత్యంత సుజ్ఞాన గబ్జాక్షగె
మెచ్చిగోపియరొడనె మనవిట్టు కూడిదగె
నిత్యకళ్యాణ నిర్దోషగె ||జ||

చరణం 2: వ్యాసావతారగె వేద ఉద్ధారగె
సాసిరనామద సర్వే శగె
వాసవాగిద్ధ శ్రీవైకుంఠనిలయగె
శేషగిరివాస వేంకటరాయగె ||జ||

చరణం 3: అంబరీషనశాప పరిహరిసి దవనిగె
తుంబురునారద ముని వంద్యగె
అంబుజనాభగె అజనపెత్తవగె
కంబుకంధర పురందర విఠలరాయగె ||జ||

రాగం: బృందావనసారంగి మరియు శంకరాభరణం — తాళం: ఆది

పల్లవి: దయమాడో రంగ దయామాడో
దయామాడో నిన్నదాస నానెందు ॥ద॥

చరణం 1: హలవు కాలదినిన్న హంబల ఎనగె
ఒలిద పాలిస బేకు వారిజనాభ ॥ద॥

చరణం 2: ఇహపరగతి నీనె ఇందిరారమణ
సహాయనిన్నదె సర్వదా తోరో కరుణ ॥ద॥

చరణం 3: కరిరాజవరదనె కామితఫలదా
పురందరవిఠల హరిసార్వభౌమ ॥ద॥

రాగం: మిశ్ర ధర్మావతి తాళం: ఆది

పల్లవి: దేవకికంద ముకుంద॥

చరణం 1: నిగమోద్ధార నవనీత చోర
ఖగపతివాహన జగదోద్ధార ॥దే॥

చరణం 5: నిగమగోచర బంద నిత్యతృప్తను బంద
నగెముఖపురందరవిఠల బందనో ॥దే॥

చరణం 2: శంఖచక్రధర శ్రీగోవింద
పంకజలోచన పరమానంద ॥దే॥

చరణం 3: మకరకుండలధర మోహనవేష
రుకుమిణివల్లభ పాండవపోష ॥దే॥

చరణం 4: కంసమర్ధనా కౌస్తుభాభరణ
హంసవాహన పూజిత చరణ ॥దే॥

చరణం 5: వరవేలాపురచెన్న ప్రసన్న
పురందరవిఠల సకల గుణపూర్ణ ॥దే॥

రాగం: భూపాలం　　　　　　　　　　　　　　　　　　　　తాళం: ఆది

పల్లవి: దేవబందనమ్మ స్వామి బందను
దేవరదేవ శిఖామణి బందను ॥దే॥

చరణం 1: ఉరగశయన బంద గరుడగమన బంద
నరగొలిదవబంద నారాయణ బంద ॥దే॥

చరణం 2: మందరోద్ధర బంద మామనోహర బంద
బృందావనపతి గోవింద బంద ॥దే॥

చరణం 3: పక్షివాహన బంద లక్ష్మణాగ్రజ బంద
అక్షయఫలద లక్ష్మీరమణ బంద ॥దే॥

చరణం 4: నక్రహరను బంద చక్రధరను బంద
అక్రూర గొలిద త్రివిక్రమ బందను ॥దే॥

చరణం 5: నిగమగోచర బందనిత్యతృప్తను బంద
నగెముఖపురందరవిఠల బందనో ॥దే॥

రాగం: ద్విజావంతి　　　　　　　　　　తాళం: ఆది

పల్లవి: నానిన్న మనకె బారెనే జయపాండురంగ ||నా||

అను పల్లవి: నాన్ని మనకె బారెనె బందరె ఈ భవద బలెయొళు
సిలుకువెనె

చరణం 1: తందెతాయిగళ తొరెద ధ్రువనిగె
చందదింద మార్గవ తోరిదె ||నా||

చరణం 2: పంకజనాభనె కుబుజెడొంకనె తిద్ది
నీ కూడిదె సంభ్రమ దిందవళ ||నా||

చరణం 3: దీనరుద్ధరిపపురందరవిఠల
ఏనుకారణ ఎన్న మరెతె జయపాండురంగ ||నా||

రాగం: *ద్విజావంతి తాళం: ఆది

పల్లవి: నారాయణ ఎన్నిరో శ్రీనరహరి
పారాయణ మాడిరో ||నా||

నారాయణనెందు అజామిళను కైవల్య
సేరిదనెంబొ సుద్దియకేళి అరియరె ||నా||

చరణం 1: చోరర భయవిల్లవొ హరినామక్కె
యారఅంజికె ఇల్లవొ
ఊరనాళువ దొరెయొ నీతిభీతిగళిల్ల
ఘోరపాతకవెల్ల దూరమాడువదక్కె ||నా||

చరణం 2: కాశిగె హోగలేకె కావడి పొత్తు
బేసత్తు తిరుగలేకె
వాసుదేవెననామ బాయితుంబ నెనెదరె
క్లేశగళెంబుదు లేశమాత్రవిల్ల ||నా||

చరణం 3: స్నానవమాడలేకె మానవరిగె
మౌనమంత్రగళేకె
దీనపాలకనమ్మ బెట్టదొడయన్న
ధ్యానకె సరియుంటె పురందరవిఠలన ||నా||

రాగం: కానడ　　　　　　　　　　　　　　　　తాళం: ఆది

పల్లవి: నారాయణనిన్న నామద స్మరణెయ
సారామృతవెన్న బాయిగె బరలి ॥నా॥

చరణం 1: ఆడువాగ నలిదాడువాగలి
నోడుత నిందు మాతాడువాగలి
కేడుతనదింద కూడి ఈభవదోళు
మాడిద పాపవు ఓడి హోగువహాగె ॥నా॥

చరణం 2: ఉరిబందాగలి ఛళిబందాగలి
గడగడ నడగుత తిరుగువాగలి
హరినారాయణ దురితనివారణ
ఇరుళు హగలు నిన్న స్మరణె మాడువంతె ॥నా॥

చరణం 3: సంతత నిన్నయ సాసిరనామవెన్న
అంతరంగదొళు యిరుతిరలీ
సంతతవరద శ్రీపురందర విఠల ఎ-
న్నంత్యకాలదొళు మననెనెసువహాగె ॥నా॥

రాగం: బృందావనసారంగి తాళం: త్రిశ్రం

పల్లవి: నిన్ననోడి ధన్యనాదెనో హే శ్రీనివాస ||ని||

అను పల్లవి: నిన్ననోడి ధన్యనాదె ఎన్న మనది నింతు సుప్ర-
సన్న దయమాడి నీను మున్నినంతె సలహబేకొ ||ని||

చరణం 1: లక్ష్మీరమణా పక్షివాహన - లక్ష్మి నిన్న వక్షదల్లి
రక్షణ శిక్షణదక్ష పాండవపక్ష కమలాక్ష రక్షిసు ||ని||

చరణం 2: దేశదేశగళను తిరుగి
ఆశాబద్ధనాదె స్వామి
దాసనెనిసి ఎన్న జగ-
ధీశ కాయొ వాసుదేవ ||ని||

చరణం 3: కంతుజనక కొట్టు ఎనగె
అంతరంగద సేవెయన్ను
అంతరవిల్లదె పాలిసయ్య
హొంతకారి పురందరవిఠల ||ని||

